# కవి పోషకులు

చుక్కాల వెంకటరెడ్డి విశాఖపట్నం
బెన్నాభక్తుల విశ్వనాధం తెనాలి
కర్రి సుబ్రమణ్యము విశాఖపట్నము
మచ్చిపురి సింహాచలము విశాఖపట్నము
ఆవపాటి చిట్టిబాబు నరవపోనిపాలెం
ఆవపాటి సత్యన్నారాయణ విశాఖపట్నం
ఆవపాటి అప్పలరాజు విశాఖపట్నము
ఆవపాటి వెంకటరత్నం విశాఖపట్నము
కొల్లి అప్పలస్వామి బురదపాడు
కాశీ రామకోటి తెనాలి (సంఘాభిమాని)
కడారు షణ్ముఖం తెనాలి
చెవ్వాకుల రామంజమ్మ పెరవలిపాలెం
లక్కోజు అప్పలనరసయ్య తెనాలి
పెంటపాటి వీరబ్రహ్మాచార్యులు (పెరవలిపాలెం)
సద్గురుకంగతిఅనంతాచార్యులుగుంటూరు
తణుకు అప్పారావు గుంటూరు
వజ్రాల ముఖలింగం తెనాలి
తరిమిణి లక్ష్మీనరసయ్య పెనుమోలు
జవ్వాది అప్పారావు గుంటూరు

తణుకు నాగభూషణం గుంటూరు
కొమ్మోజు బుచ్చయ్య లింగంగుంట
కొత్తలంక హేమయ్య గుంటూరు
కోనూరి సాంబశివరావు గుంటూరు
లక్కోజు సత్యన్నారాయణ తెనాలి
పెదగాడి సూర్యనారాయణ తెనాలి
పుల్లేటికుర్తి వెంకటరత్నం ఐతానగరము
కాళహస్తి కనకాచార్యులు మంచూరు
తణుకు వీరభద్రము కొలకలూరు
మాచేపల్లి దీనరక్షకుడు కాజీపేట
శిల్పవిద్యా విశారద వరబా విశ్వనాధం (తెనాలి)
పాతకమూరి ఈశ్వరాచార్యులు పరిమి
కానుగంటి వీరాస్వామి పరిమి
లక్కోజు వెంకటరత్నాచార్యులు తెనాలి
వజ్రాల భీమలింగాచార్యులు తెనాలి
మాచేపల్లి బ్రహ్మం తెనాలి
కొసనా కామరాజు తెనాలి
లక్కోజు సత్యన్నారాయణ అత్తోట

# తొలిపలుకులు

శ్రీసర్వ జగద్గురు సనారీ విశ్వేశ్వరావధూత స్వాముల వారియనంత గుణగణ విశేషోత్కృష్ట లీలావిలాసములలో యతిక్రించతువిషయములు, సంస్మరింప నుద్దేశించి శ్రీస్వాముల వారి కృపావిశేష రత్నాకరమున నోలలాడు నాజనకులు బ్ర॥ శ్రీ॥ కప్రి లక్ష్మణాచార్య కవిగారి మనోభీష్టాను సార మీశతకము మత్తేభ శార్దూల పద్యములలో వ్రాయడమైనది. శ్లో॥ 'ప్రమాదో ధీమతామపి' అను నార్యోక్తి ననుసరించి యిందు కొన్ని దోషము లుండవచ్చును. రసగ్రహణ పారీణులట్టి నీరసుల విసర్జించి భావ ప్రాధాన్యమే గైకొని నన్నాశీర్వదింప ప్రార్థన.

యీగ్రంథమును ప్రచురించిన శ్రీసుందర రాం అండ్ సన్సు ప్రొప్రయిటరుగారగు శ్రీయీాదర సుందర రామయ్య పంతులుగార్కిని గ్రంథ పోషకులకును స్వల్ప కాలములో శ్రమయనక శతకము ముద్రించి ఆంధ్ర పాఠక కరకమలముల కందచేసిన శ్రీసారథిప్రెస్ వారికిని నాకృతజ్ఞతా వందనములు.

13-2-47 }
తెనాలి. }

ఇట్లు
సుజన విధేయుఁడు
కప్రి అచ్యుత రామారావు.
ఆంధ్ర కవితా కుటీరము

# పండితాభిప్రాయము

చిరంజీవి శ్రీ కర్రి అచ్యుతరామకవిగారు వ్రాసిన శ్రీసనారీవిశ్వేశ్వరశతకమును స్థాలీపులాకన్యాయమునఁ జదివితిని అందీబాలకవి శ్రీసింహాద్రినిలయాచార్యుల యనుజుండు యోగిగమారుట, యోగిగమారిన తమ్ముని నీలయాచార్యులు నిందించుట, అద్దానిని విని సహింపజాలక నీలయాచార్యులకు సనారీప్రభువు శాపంబిచ్చుట, తన్మూలమున నీలయాచార్యుల పుత్రనాశనము, రాజమహేంద్రవరమున తహశీల్దారు శ్రీవారికి గావించిన కౄరదండనము, అట్టిదుర్మార్గమున నాతఁడొందిన విపత్తు, పిమ్మట మద్రనగరమున, దాను గిరిజావల్లభుఁడనని వచింపఁబౌరులు గిరిజనిరూపమని కోరుట, వారి కోర్కెప్రకారము గిరిజను జూపుట, దానిచే వారు నమ్మకున్న ఫాలనేత్రముజూపి పౌరుల విస్మయచిత్తుల గావించుట మొ॥ అంశములను సులభశైలిని పండిత పామర సుబోధకంబుగా వ్రాసెను" యిదియే యీబాలకవి ప్రథమప్రయత్నమగుటచే నేవేని కొన్ని లోపములుండినను మున్ముందీబాలకవి ప్రౌఢకవిగామారి యుత్తమగ్రంథకర్తయై యాంధ్రభాష కుచితకీర్తి సేవనొనర్ప తగుసమర్థులుకానోపుదురని విశ్వశించుచున్నాను.

విజయనగరం
8-8-46

ఇట్లు సుజనవిధేయుఁడు
విద్వాన్ సోమయాజుల సత్యన్నారాయణశాస్త్రి
ప్రధానాంధ్రోపాధ్యాయుడు
పురపాలకోన్నత పాఠశాల.

శ్రీసనారీ విశ్వేశ్వరాయనమః

# ప్రార్థనా షట్కము

శ్రీరంజిల్లెడు పాలకొండపురిలో జిద్రూపుఁడై పుట్టి, సం
సారాంభోధినిదాటి, శిష్యతతికిన్ । సద్బోధలన్ జేసి తా
ధీరుండై తపమాచరింపగను । గుత్తికొండ కున్జేరె, నే
వీరుండో యతనిన్ సనారియని సేవింతున్ మమున్ బ్రోవగన్ ।

పరమోత్సాహముతోడభక్తతతి । సద్బ్రాహ్మణ్యప్రోత్సాహులై
ధరనేకార్యముకైన ముందుమదిలో । ధ్యానింతు రెవ్వాని నా
గిరిజా పుత్రుని విఘ్ననాయకుని నే । కీర్తింతు డెందమ్మునన్,
కరుణన్ జూడు మటంచు భక్తిమెయినో । కాశీసనారిప్రభో

గీతాలాపన చేయ బ్రహ్మపురిలో । గ్రీడాస్థలిన్జొచ్చి తా
చేతన్వీణనుబూని మీటుకొనుచున్ । జెన్నార సంగీతమున్
ప్రీతిన్వల్వడజేయుధాత సతియా । శ్రీభారతీ దేవినే
జేతః ప్రీతిగఁగొల్తు నెప్డుధరలో । శ్రీకాసనారిప్రభో

సురవంద్యా ! ముజనావనా ! శుభకరా ! సుశ్లోక ! యార్తావనా!
స్మరియింతున్మది నిర్వికార! సుభదా! శాంతస్వరూపా! భవా!
కరుణాసాగర! వేదపూరుష! దయ । న్గాపాడి సంసారమున్
దరిజేర్పంగను గావదేమి జనకా । ధాతా సనారిప్రభో॥

కరయుగ్మంబున నిన్ను గొల్వక నుసత్కార్మాంబుధిన్ దేలకన్
దురితంబుల్పలు సేయ బాల్పడియెడీ । దుర్మార్గ సంఘంబుకున్
తిరమా! సౌఖ్యము సంపదల్ వయసు పు । త్రీపుత్రులు న్భార్యయీ
ధరలో శాశ్వత కీర్తిదప్ప ప్రజకున్ । ధాతా సనార్త్రిప్రభో

సదయా! నిర్మల! నిష్కళంక హృదయా! సర్వజ్ఞచంద్రా! హారా
యుదయార్క ప్రచితార విందవదనా! యోంకారనాద ప్రధా
మదనాకార విరాజితా! శుభకరా! మాసీశ్వరా! శంకరా!
బుధసంసేవిత! యాత్రరక్ష! విమలా! పూజ్యాసనార్త్రిప్రభో

తమనామంబు దలంప, పాపహరమా! దారిద్ర్యము న్బాయుడీన్
తమనామంబు దలంప జ్ఞానమొదవున్ ధన్యత్వ మోక్షమ్ములున్
తమనామంబు దలంప మృత్యుహరమా! ధాత్రిన్న భీష్టార్థమా
తమనామంబు దలంప రోగహరమా! ధాతాసనార్త్రి ప్రభో

తమనామంబు దలంపదాన ఫలమున్ । ధాత్రిన్సుధాపానమున్
తమనామంబు దలంప యాత్రఫలమున్ । ధర్మప్రబోధంబునున్
తమనామంబు దలంప యజ్ఞఫలమున్! దైవప్రదర్శంబునున్
తమనామంబు దలంప మోక్షమొదవున్ । ధాతాసనార్త్రిప్రభో

కలలోనంగడు నిద్రయందు పనిలో । గానంబు నన్మేలు మా
టలలోనంగడు పిన్నపెద్దలయెడన్ । డంబంబుగాం బోకనే
పలుమారున్మది రేబవళ్లు విడకన్ । ప్రార్థించుచున్నాడనా
[illegible] లోకరక్షా! యనఘా । ధాతాసనార్త్రిప్రభో

గీర్వాణాభినుతా! యనంతచరితా! కీర్తిప్రదుమా! శంకరా!
గర్వాంధద్యసురాది పాపహరణా! గంగాధరా! పాహిమాం
శర్వాణీనుత దేవదేవవినుతా । సత్యప్రదా చిన్మయా!
సర్వాంతర్యగుణాది దేవయమలా! స్వామీసనారీప్రభో॥

విధినీవన్నను విష్ణుమూర్తివనినన్ । విశ్వేశుఁడన్నన్ సరే
సదయా నామములన్నినీకెయనుచున్ । స్వాంతంబులోనమ్మియా
విధినేహర్షమునొందుచుంటినను నీ । వేరీతి రక్షింతువో
బుధసంసేవితయార్తరక్షక । మహా! పూజ్యాసనారీప్రభో॥

భువనోద్ధారక! భక్తపాల! వరదా! ముక్కంటి!మృత్యుంజయా!
భువినేవర్ణమువారలైనమదిని । న్పూజించగావారికి
న్దివిదైశ్వర్యములిచ్చిబ్రోతువనుచున్ । విశ్వంబులోనందు రీ
యవనిన్నన్నెటుగావఁజూతువోగదా । యార్యాసనారీప్రభో॥

ధరణీచక్రమునంచలించినను వేల్ । తారల్భువిన్ డ్రుల్లినన్
ధరణీశుల్దురితాత్ములైన, రవిచంద్రాదుల్గతుల్దప్పి, సా
గరముల్ హద్దులుదాటినన్ సురమునుల్ । గర్వాంధులైనన్ సరే
ధరనాభక్తికిమార్పుఁ దేకుప్రభువా! ధాతాసనారీప్రభో।

కాలాతీతమ దేలభక్తసదయా! గౌరీమనోనాయకా!
యేలానీదయరాదుదీనునియెడ । న్నంతేనిగీర్తింతునీ
వీలీలన్‌గడుజాగుసేయుదగునా? హే! కాశివిశ్వేశ్వరా!
జాలంబేలనునన్నుఁగావగజగ । త్స్వామీసనారీప్రభో॥

కామాక్షీహృదయాబ్జమిత్ర! సుహృదా! కైలాసవాసాభవా!
కామారీ! కవిపండితార్యవినుతా! కాశీపతీ! పావనా!
కామక్రోధగుణాదిశత్రుహరణా । కల్యాణరూపప్రదా!
రామయ్యాఖ్యకనిష్ఠపుత్ర! యనఘా । రత్నాసనారీప్రభో॥

కరుణాసాగరచంద్ర! దేవ! యుభవా! కాత్యాయనీనాయకా॥
సురసంసేవిత! భక్తవత్సలదయాసుజ్ఞాన చంద్రా! హరా॥
నిరతంబున్ త్వమపాదసేవపెరిమిన్ । నెమ్మిన్ ప్రభూ సేతునే
ధరసన్నిట్టులఁగానకున్నత గునా । ధాతాసనారీప్రభో॥

కవిచంద్రా! సురలోకపాల! వరదా! కైలాసవాసా! సదా!
భవదీయంబగు పాదపద్మములు నా । భావంబులోనుంచి యీ
భువియందున్ స్మరియింపు చుంటియచలా! పుణ్యప్రధావేగన
భవ బంధమ్ములఁబాపరమ్మ్రుదయతో । బాబ సనారీప్రభో!

నీయానంద ముఖారవిందమును, మా । నేత్రంబులన్జూచినన్
నీయత్యంత ప్రభావపాదయుగము । న్నిత్యంబు సేవించినన్
నీయుత్కృష్టపు నామమంత్ర తతులన్నిత్యంబు వర్ణించినన్
బాయున్గష్టము లెల్ల మాకు పృథివిన్ । బాబాసనారీప్రభో

హిమధామాననా! నాగభూషణ భవా హే ! భద్రకాళీపతే!
హిమవత్పర్వత రాజపుత్రిపతి స ! ద్హృద్భక్త పాలాగ్రణీ!
యమదైత్యాఖిల దుష్టశిక్షకప్రభూ! యార్తాళిసంరక్షకా!
సమమా దెవముధాత్రి యుంమగలడా ! స్వామీ సనారీప్రభో॥

భక్తార్తావన ! సర్వమాన్యవినుతా! బ్రహ్మాండసంశోభితా
భక్తాదీన పరాయణా! సుహృదయా! పాల్గొండగౌరీపతీ!
యుక్తాయుక్త విచారతత్వహృదయా! యుత్కృష్ట తేజోమయ
ముక్తాహారవిరాజితా! శుభమయా! పూజ్యాసనారీప్రభో

అంభోనాధసుతాకళత్రనుత! ఘోరాఘార్తావనా! అన్నపూ
ర్ణాంబాదేవి హృగబ్జబంభర! సదానందస్వరూపా! భవా!
జంభారీస్తుత! చంద్రవతాళి! సుజనా! సద్వాసవాసాహరా!
శంభోశంకర! కావవేదయనుసన్ । స్వామీసనారీప్రభో॥

నేనేసృష్టికిమూలమైనవిధినో । నేనేవికుంఠేశుడన్
నేనేశాంకరినాథుడన్మఱియు నే। నేయాపరాశక్తినో
నేనేనింగియుభూమియున్నాకములు । న్నేనేమునీంద్రాళినో
నేనేసర్వమటంచుదెల్పితివి । వారాసీశాసనారీప్రభో॥

ఓకారుణ్యపయోనిధీ! గుణనిధీ! ఓభక్తరక్షానిధీ!
ఓకైలాసపతీ! ముకుందవినుతా! ఓపన్నగేంద్రాంగదా!
నాకేలాయితరత్రచింతలుమద । న్నాకెవ్వరున్నారయా
నాకాధారమునీవుగాక భువిలో । నార్యాసనారీప్రభో।

సాంద్రానందముఖారవింద! యమలా! పన్మాన్యసంసేవితా
చంద్రోద్భాషిత! భక్తరక్షకప్రభూ । చాముండి హృచ్చోర
నీంద్రస్తోత్ర! కపాలహస్త! శుభదా! నీదివ్యనామంబునున్
యింద్రాదుల్జపియించిధన్యులవరే । యీశాసనారీప్రభో॥

ఒకపర్యాయముభక్తితోడమదిలో । నోవిశ్వనాథానసా
రి! ఖవీంద్రాధిప । భక్తసన్నుత । మురారిస్తోత్ర! శ్రీకంఠ కో
రికతీరన్భజియించువానికిడవే । రిత్తన్వడ న్జేతువే
సకలార్థంబులుసర్వకాలములలో । స్వామీసనారీప్రభో॥

ఖగరాడ్వైరిసుభూషణా! మునినుతా! గంగాధరా! దేవ! యో
నగరాజాత్మజవంద్య! శిష్టవినుతా । నాదప్రమోదాపరా!
నిగమాతీత! సుధీ! యనంతచరితా! నిర్వీర్య! మారాంతకా!
సుగుణాతీత! శివా! యమోఘవిమలా! సూరీసనారీప్రభో॥

"తనసంపాదనబీదవారికొఱకై । ధర్మంబుగా" । బేమతో
తనదాయావనమంత భార్యకొఱకై । దానంబుగా "భక్తితో
తనప్రాణంబును దైవసేవకొఱకై" । "ధాత్రీస్థలిన్మానవు
ల్వాని యోగించిననాఁడుపూజ్యులుగదా । విశ్వాసనారీప్రభో॥

"తనయింటన్నునలందుదాసివలెనున్"।"తంత్రంబునన్మంత్రిగా"
'తనశృంగారమునందులచ్చివలెనున్' । 'ధైర్యంబునన్భామిగా'
'తనుభోజ్యంబిడువేళతల్లివలె' 'నిద్రావస్థలోవేశ్యగా'
వనితారత్నముసంచరించవలెనో భవ్యా; సనారీప్రభూ॥

'విద్యేమూలనుదాచినట్టిధనమై' 'విద్యేహితుల్బంధులై'
'విద్యేన్యాయమునిచ్చునట్టిప్రభువై' 'విద్యేస్వరూపంబునై'
'విద్యేజీవులఁగాచునట్టిపరుఁడై' 'విద్యేసుసౌఖ్యంబునై'
విద్యావంతునిఁగాచుచుండుసతమీ । పృథ్వీన్సనారీప్రభో॥

పవనాహారినిఁబట్టినన్బుధులలో । పాండిత్యముఙ్జూపినన్
కవితాలత్యమెఱింగినన్ మహితమా । గానంబునున్జేసినన్
యువతీచిత్తమెఱింగినన్ యశముతో । నుప్పొంగుచున్నన్నరే
భువిలోనిన్నదఁగొల్చునప్డెమనుజు । లూప్రజ్యాల్సనార్ప్రభో॥

పరవిత్తంబును మంటిపెల్లవలె సం। భావించినన్, భక్తితో
పరకాంత న్తనకన్న తల్లివలె తా। భావించినన్ ప్రేమతో
పరకార్యంబును స్వంతకార్యము గతిన్। భావించినన్ మానవుల్
చిరకాలమ్ము సగౌరవార్హులుగదా । శ్రీశాసనారీ ప్రభో

నిధులన్ ద్రొక్కిన, ధర్మసత్రవులన్నిర్మించినన్ భక్తితో
బుధులన్గొల్చిన, సర్వశాస్త్రములకు। న్వ్యాఖ్యార్థము ల్చెప్పినన్
నదులన్స్నానము చేసినన్. మహితమా । న్యాయంబు పాలించినన్
ముదమారన్ నినుగొల్చునప్డె మనుజు । లూప్రజ్యాల్ సనార్ప్రభో

అతిదుర్బాలురు భూపతుల్ మగువలున్ । యల్లుళ్ళు దాసీజనుల్
క్షితిలో సౌఖ్యము లేమిగానరు బుధుల్ । చిత్తంబునొప్పించుచున్
యతియుత్సాహముఁబొందుచుందురుసదా।యవ్వారితో నెచ్చటన్
మతిమంతుల్గల హించరాదు. భువిలో । మానీసనార్ప్రభో

సన్మానింతురు"బంధువుల్" హితవరుల్ । సన్మార్గచిత్తంబుతో
సన్మానింతురు "విద్యగాని", సుజనుల్ । సత్ప్రేమతో. పృథ్విలో
సన్మానింతురు "వృద్ధులన్" బుధవరుల్ । సద్భక్తితో భక్తులన్
సన్మానింతురు వీరువారలనకన్ । స్వామీసనార్ప్రభో

"ఋణశేషంబును, శత్రుశేషము" ప్రజల్ । యేరీతినైనన్ సరే
అణుమాత్రంబును దాచరాదు. బహుళశ్లాఘ్యమ్ము తోనుంచినన్
ఋణమా ! వృద్ధికి వృద్ధివృద్ధియగు మీ । కెవ్వేళలన్ శాత్రవుల్
రణమున్గోరుచు శాంతియుంచరు మదిన్ ॥ రక్షా! సనారీప్రభో

సిరివంతుస్తన భార్యబిడ్డలు మదిన్ । శ్రీజార్జి సామ్రాట్టుగా
సరసుల్పండితురీతిగా, హితవరుల్ । సన్మార్గుగా, చుట్టముల్
కరుణాశాలిగ, వేశ్యమారునిగ, లో । కంబందు భావింతురా
సిరిగోల్పోయిన వైరివోలెగనరే । శ్రీశా సనారీప్రభో

రోషాగ్రేశ్వర చక్రవర్తియయినన్ । రోగిష్ఠి వాఁడైన, స
ద్భాషాపోషకుఁడైన, క్రూరుఁడయినన్ । పాపిష్ఠియైనన్ సరే
కాషాయాంబర దండముల్గలిగినన్ । కర్మిష్ఠి లోకంబులో
భూషింపంబడు సర్వదాయతిగతిన్ । పూజ్యా సనారీప్రభో

"ధనమున్భార్యనుపుస్తకంబును" ప్రజల్ । తావీడి పైవారికి
చ్చినచోవెండి గ్రహించలేరు. బహుళశా ॥ చేజిక్కెనన్ భ్రష్టయై
వనితారత్నము వచ్చు, విత్తమనినన్ । భాగంబులైవచ్చు, ధా
త్రిని పొత్తమ్ముచినింగి వచ్చునుగదా । దేవా! సనారీప్రభో

నిడుకొమ్ముల్గలరొద్దు నున్మగనితో । నిర్లజ్జగా మాటలా
డెడుభార్యన్గురిలాత్మునిన్ పతికి చా । డీచెప్పెడర్ధాంగినిన్
నడువీధిన్బతియాజ్ఞ మీరి మెలగే । నారిన్సదా మానవు
ల్విడువంగావలె వారిక్షేమమునకై! పృథ్విన్సనారీప్రభో

స్వరమాధుర్యము కోకికిన్, యతులకు న్శాంతస్వభావంబు, సం
గరలక్ష్మీ విజయంబు భూపతులకున్ । జ్ఞానమ్ము విద్యార్థికిన్
తరుభర్త్నమ్రది గొల్చు పేసతికిసౌం । దర్యంబుఁజే కూర్చునీ
ధరలో నెల్లెడ సర్వకాలములలో । ధాతాసనారీప్రభో ।।

'కొఱగానట్టిసతీమణిన్ "హితవరున్' । కుగ్రామమున్ "రాజ్యముర్
'కొఱగానట్టి హయంబుర్' వరములర్ । కోపిష్టినిర్ 'బంధువుర్
యిఱు వేళల్విడువంగవచ్చు, సుజనుల్ । యీనీతి మార్గంబు తా
మఱియం జాలినసౌఖ్యవంతులు గదా । మానీసనారీ ప్రభో

అవధానంబులు చేసినర్ 'ప్రజకు తా । నాచార్యుఁడైనన్సరే
సవనంబుల్పలు చేసినర్ "మహితమా । సన్మానముల్పొందినర్
నవధానంబుల నిచ్చినర్ 'ప్రజలపై । న్యాయాధికారైననీ
భువిలోనిన్నిదఁ గొల్చునప్డె మనుజు । ల్పూజ్యుల్సనారీ ప్రభో

# మద్రాస ఘట్టము

మారాకార! దయాసముద్రనిలయా । మద్రాసు పట్నమ్ములో
మీరల్నవ్వుచునుండ నాఁడుకినుకన్ । మీరూప మున్గాంచియో
బైరాగీకులమెద్దిసీకు? యెవరీ । పట్నమ్ములో బంధువుల్
ఆరుద్రాక్షుల పేరులేమి? కరమం । దాదండ మే మీయినిన్

దారిన్బోయెడివారు బోక తమతో ! దర్పోద్ధతిన్ నిల్పి చా
క్రూరాత్ముల్ హసియించి ప్రశ్నలడుగన్ ! కేల్మోడ్చి హర్షించి నే
గౌరీనాథుఁడనంచు వారియెదుట । గ్గంభీర వాగ్ధాటితో
ధీరోద్ధార ! వచించితీవు ప్రకటన్ । దేవా సనారీ ప్రభో

వినుసీవా గిరిరాజపుత్రి పతివై । నెల్గొందు చున్నప్పుడా
జననౌపార్వతిఁజూపుమీననగమీ । స్వాంతంబులో మెచ్చుచున్
కనుచో పండితులారా! మీరలిపుడా । కాత్యాయనీదేవినిన్
యనగా వారలు తేఱిచూచిరిగదా । ఆర్యా! సనారీ ప్రభో

నేవిశ్వేశుఁడనన్న వీరుభళిరే । నీభార్యయా పార్వతీ
దేవిన్జూపుమటంచు కోరిరి కనా । దేవత్వముచ్చిల్ప వే
రావే పార్వతియంచు బిల్వగను శ । ర్వాణీ మహాహ్లాదయై
దేవాయంచును మ్రోలనిల్చెను గదా । దేవా సనారీ ప్రభో

భళిరేగారడి విద్యఁజూపితివి ఝు ॥ బ్బాలామణిన్దెచ్చి నీ
వలెనేకొందరు మోసగాండ్రు మముల । న్వంచింపయత్నించిరో
పలువా! శంభుఁడవైనసీవు వినుమా । పాలాక్షుమున్జూపి, పౌ
రులకానందముఁ గూర్పుమంచడుగ శ్రీ ! రుద్రుండనే వేయనిన్
దెలుపన్మూఁడవకన్నుఁ జూపితివిగా । దేవాసనారీ ప్రభో

# కాలజ్ఞాన ఘట్టము

బ్రహ్మజ్ఞానవిరాజితా! తమరు । యేప్రాంతంబుగనొప్పియు యే
బ్రహ్మజ్ఞానులఁగూడివచ్చి । ప్రజలన్పాలింతురో దెల్పి, యీ
బ్రాహ్మణ్యంబుకుసంతసంబుఁగొలుప । న్ప్రార్థించుచున్నార మో
బ్రహ్మర్షీయనివారుకోరియడుగ । న్బాబాసనాథప్రభో॥

బ్రహ్మానందముతోడభక్తులచట । ప్రశ్నించుప్రశ్నావళికిన్
బ్రహ్మానందముఁజెందవారియెదుటన్ । రాజర్షిశ్రీపోతులూర్
బ్రహ్మంగారినిఁగూడివచ్చిప్రజల । న్పాలించి పృథ్వీస్థలిన్
బ్రహ్మానందముఁగూర్తునంటివిగదా । బాబాసనాథప్రభో॥

# సోదర ఘట్టము

ఓరీ! నీకిదియేమిబుద్ధి వినవా? యూహూరు లో నీలయా
చారీ! మీయనుజుండు పిచ్చిమనిషా । సన్యాసియా? లేనిచో
ఆరుద్రాక్షులపేరులేమి? కరమం । దాదండమే మీయనిన్
కారుల్గూయుచు నుంద్రి నిన్నుగనుకన్ । కాపాడుమా కీర్తిసం

సారం బీదుము, లేనిపోనిపడల న్జాలించు లేకున్నచో
పారంపర్యమువచ్చునట్టి మనదా। వంశోన్నతుల్ వ్యర్థమా
బైరాగుల్గలఁగొంపఁ జేయకుమి నీ। వంశంబు సత్కీర్తుల
స్వైరునోర్మసిన దన్నయగ్రజునితో। విశ్వా! సనారీప్రభో

చెడుగుల్కొందరు నన్నుఁగాంచిమదిలో। చిల్లంగి చిల్లంగనన్
వడినవ్వారలతోడఁ గూడిపిలువన్। భావంబు యెట్లొప్పెరా
చెడుగా! యన్నవుగావె నీకుతగునా?। శింహాద్రి వంశాబ్ధిసో
ముఁడవై నీవిటు బల్కవచ్చుననుచున్। పూజ్యా! సనారీప్రభో

హితమున్ దెల్పెదు వారినందగిని నీ। యిష్టాను సారంబుగా
మతిలేనట్లుగదూర నీకుతగునా ! మర్యాదయా? నన్నునీ
క్షితిలో నల్పుని భాతిసెంచితివి నా చిత్తంబునన్ సైచితిన్
ప్రతినంబల్కనకీడుదప్పదనవే। భవ్యా! సనారీప్రభో

అన్నా న్యాయపదంబుఁదెల్పితిని। నిన్నారీతిగాదిట్టరా
దన్నానంతియెగాని నేను మఱియే। మన్నానకోపంబుతో
నన్నీరీతిగదూరనీకుతగునా? నన్నన్న నీకేగదా?
చిన్నన్నన్ దయఁజూడుమా యనుచు వి। శ్వేశా! సనారీప్రభో।

మనవంశంబునలేనివాఁడవు భళీ! మర్యాదరా! నీకు నీ
గొనమంతావెలిబుచ్చినావు కుమతీ "గ్రుడ్డొచ్చిపిల్లన్భ్రమిం
చినటుల్బోధలుసేయుచుంటి వికఁ, నీచీవాట్లు చాలాప్లురా
అని నీలయ్యమనంబునందుఁగినిసెన్ ! ఆర్యా! సనారీప్రభో।

అరగేబుద్ధివిహీనుఁడా! నిజము ర । వ్వంతైన గుర్తించకన్
దురహంకారముతోడ నన్నసరుటన్ । దూషించుటప్పాడియే
సరసుల్మెత్తురె నిన్నుఁగాంచి భువిలో । చాల్చాలు నీబుద్ధికిన్
కరమానందముగల్గెనన్న తమతో । కాశీసనాథప్రభో॥

వికటంబాడుచున్నవాఁడవటరా । వృద్ధైన నాతోడనా
యికనీయాటలుసాగబోవుఁగనుకన్ । యీనాఁడు నాయింటనీ
వొకగంటైనను నిల్వరాదు కుమతీ । యుత్సాహముల్గల్వనీ
విక నాకేమియుఁజెప్ప రాదనియెనో । విశ్వా! సనాథప్రభో॥

కుమతుల్మాటలు లెక్కఁజేసియనుజా । కోపంబు తోదూరి, గే
హామునందుండక బొమ్మబొమ్మనిన నీ । యాజ్ఞానువర్తుండనై
నిముసంబుండక పోవుచుంటినిక, నే । నీయింటి కైరాను, నా
శ్రమ నీకెద్దివిధంబు నీయననవే । స్వామీ సనాథప్రభో

కుమతీ! నాగుణమంత నీవెఱుగవా । కోపించి పొమ్మంటివా
నిముసంబైనను నిల్వబోను వినుమా । 'నీయింటిలోవచ్చు రో
గముమిత్తైనడయాడుగాక! మదిలో । గర్వోన్నతిన్వేనవేల్
శ్రమలన్ జిక్కుఁడవీవుగాక యనుదున్ । స్వామీ సనాథప్రభో

వరదాతా! తమరిచ్చు శాపమునకున్ । వ్యాధిప్రబద్ధంబునన్
జ్వరమో లేక శిరస్సు బాధకలిగెన్ । వారంబు కొండొంటుగా
వరుసన్నీలయచారి వర్యకొమరుల్ । స్వర్గస్థు లౌచుండె మీ
కరుణా పాత్రులుగామిఁజేసి ప్రభువా । కాశీసనాథప్రభో

అయయో! యెంతటి బుద్ధిహీనుఁడను నే । నజ్ఞానినై యెప్డు నా
ప్రియమే కోరెడునట్టి తమ్ముని మహా । వేదించి వేదించి ని
ర్దయుఁడైనాఁడను నాకుసద్గతికి మా । ర్గంబున్నదాయంచు నెం
తయు చింతించెను నీలయాఖ్యుఁడుమదిన్ । ధాతా! సనారీప్రభో

అనుజా! నీవొక వెఱ్ఱివాఁడవని నే । నన్యాయమార్గంబునన్
నినుబొమ్మంటిని పోనిపక్షమున, ని । న్నేమేమొనిందించి నీ
ఘనకోపాగ్నికి నాకుమారులను చి । క్కంజేసి కాల్పించితిన్
ననుమన్నింపుమటంచు నీలయను ది । న్నాధాసనారీప్రభో॥

హితముల్ జెప్పెడు నిన్ను దూషిఘన మా । యిక్కట్లపాలైతినా
సుతులంతాదివి కేగినార లిపుడీ । శోకాగ్నిలో ద్రోసి, యీ
సుతనైనన్నరెదక్కనిమ్ము గృహమా । శూన్యంబుగానుండె, నా
వెత నెవ్వారికిజెప్పుకొందుననియెన్ । విశ్వాసనారీప్రభో॥

అటులేగాచితి నీకుమారితను, నీ । నజ్ఞానివైనన్ను నీ
వెటునిందించగనెంచినావొ యటులే । నిందించినావోరి! యిం
తటినుండైననుబుద్ధి తెచ్చుకొనుమా । నామాటలాలించి' వె
న్కటి క్రూరత్వముమానుకొమ్మనవె శ్రీ । నాధాసనారీప్రభో॥

# గోదావరీ పుష్కర షట్కము

శ్రీవిద్యానగరంబునేలు ఘనుఁడున్, శ్రీలక్ష్మీసంపన్నుఁడున్
యా విశ్వేశ్వరుపాదభక్తుఁడగు శ్రీ । యానందరాజేంద్రుఁడున్
దేవా శిష్యునికీతినేలితివి" యా । ధీరుండు మీపాదముల్
భావంబందుననుంచి పూజసలుపున్ ! బాబాసనారీప్రభో॥

ఒకనాఁడా నరనాయకుండు తమతో । నో తాపసీ! మిమ్ము నే
నొకప్రశ్నంబడుగంగవచ్చితిని నా । కున్నట్టిసందేహమున్
సుకరంబొప్పగ శంకలేక నిపుడే । శుద్ధార్థబోధింపవే
సుకమౌనీంద్రునిరీతి శౌనకులకున్ । సూసకీసనారీప్రభో॥

స్వామీపుష్కరతోయమందున ప్రజల్ । స్నానంబుచేయున్మహా
పాపముల్బాసిసమస్తసౌఖ్యములతో । వర్ధిల్లుటల్ సత్యమే?
ప్రేమారన్నెలవీయుమన్న, తమరా । వృత్తాంతమున్ జెప్పియా
భూమీశున్గనిదీవెనంబులిడరే । పూజ్యా! సనారీప్రభో॥

హరిరాశిన్గురుడున్న వేళతనదా । యర్ధాంగులన్గూడి, పు
ష్కరుఁడానందముతోడస్నానమునకై । సద్గౌతమిన్ జొచ్చు, గా
న, రహిన్స్నానవులానదిస్సరియుతో । స్నానంబుచేయున్మహా
నరకంబుల్ మొదలంటపోవునన రే । నాథా సనారీప్రభో॥

ఏనీరంబున పుష్కరుండు తనదా । యుల్లాసంబుతో స్వేచ్ఛగా
స్నానంబాడెనో యట్టి పుణ్యజలమా । సద్గౌతమీలోపలన్
యానందేశ్వరనీకుఁజూపెదను ర । మ్మన్నట్టి మీతోడనా
త్మానాథుండు ప్రయాణమయ్యెనఁగదా । స్వామీసనారీప్రభో॥

కరిఘీంకారముఁ బోలె రోదనముతో । కాలాఘ్ని చందంబున
న్నరవేగంబున వచ్చునట్టి ఘనమా । సన్నాత మీయందు పు
ష్కరతోయంబులఁజూపి రాజుమది హ । ర్షింబందగాఁజేయవే
కరుణాసాగరచంద్ర! ప్రేమమెయి శ్రీ । కాశీసనారిప్రభో

కనులారన్గనుగొంటి గౌతమినది । న్నాలాఘ్ని చందంబునన్
జనెడాపుష్కర తోయముల్ యిపుడు। నాసంకోచ మీడేరె, నీ
ఘనతన్ లావునుఁబెంపునున్ దెలుపగా । గంభీరుఁడౌ యాది శే
షునకైనన్ సులభమ్ము కాదుగద శ్రీ ! కాశీసనారిప్రభో

# కంచి మొదలియార్ ఘట్టము

'భద్రాద్రీశుని సేవఁజేయువణి జా । పాలించు రాముండు, సౌ
భ్యదంబున్నిడి' 'తాళపత్రలిఖితం । బౌశూలి సద్గ్రంథము
న్ముద్రింపించగవచ్చినాఁడగనుక । న్ముద్రించి సత్కీర్తులన్
భద్రంబుల్గొనుమన్న నాతడని మెన్ స్వామీ సనారిప్రభో

'మీపాత్రంబును నచ్చునొత్త మఱియే । మీచిక్కులన్ లేవు' నే
పాపుండౌటను కుష్ఠు రోగినయితిన్ । బ్రహ్మాండమౌ బాధతో
నాపాత్రంబును నచ్చునొత్తగలనా । యంచున్నదామిమ్ము నే
రేపున్మాపనిఁ ద్రిప్పుచుంటినని గౌ రీశా సనారిప్రభో

పురుగుల్గారెడు నాదుకుష్టురుజ వే । బోఁగొట్టు వారెవ్వరీ
పురిలో లేమిసి జేసి చింతపడుచు । న్భూజించు చున్నాఁడ నా
హారిద్రైనాగరుణించి నాయుసురులన్ । హా! దీయకుండెన్నదా
భరియింపంగను లేను బాధలనుచున్ । భవ్యా! సనార్కిప్రభో

దీనత్వంబున వర్తకుండు 'తపసీ । దేహంబనారోగ్యమై
నానాట స్పృశియించుచుండె, సుఖము । న్నాలేదు, ధాత్రిన్సదా
నానామందులువాడినాఁడ నికము । న్నైన్న నాస రేయిచ్చి నా
ప్రాణంబుల్దరి జేర్చ్పమంచుఁ బలుకన్ । భవ్యా సనార్కిప్రభో

మునునా పౌత్త్రమునచ్చునొత్తి మదికి । న్మోదంబుఁ జేకూర్పగా
నినుబాధించెడు కుష్టురోగమును నే । నిర్మూలమున్ జేతునో
వణిజా! భీతినిఁ జెందబోకు ధరనీ । వ్యాధి వ్యదల్ నిత్యమా
దిన చారస్తితిగా దెయున్న తమతో । దేవా! సనార్కిప్రభో

అటులేనాదగు జబ్బుపోయినచో మీ । రన్నట్లుగా పౌత్త్రమున్
న్నెటులైనన్ శ్రమనొందియైన మఱియే । యిక్కట్లు పాలైననే
తృటిలో ముద్రణవైచియీయగలనో । దేవానను సాకుమా
జటధారీ! యని వేడి, ముద్రణకునై । స్వామీ సనార్కిప్రభో

ఆరోజే పనివాండ్రఁనుంచి, వడిగా । నత్యంత హర్షంబుతో
గౌరీనాధుని గ్రంధమైన తమదా । గ్రంధంబు ముద్రించగా
కారుణ్యామృత దృష్టితోడ వణిజు । న్గాపాడ మీయాత్మలో
వీరయ్యాఖ్యతనూజ! యెంచితివి, వి । శ్వేశా సనార్కిప్రభో

పవళింపన్ జనుదెంచు వర్తకుని, సద్భావంబునన్బిల్చి, వో
యి,వణీంద్రా! మది దైవమున్ దలచి నీ। వీసీరమున్ గ్రోలి, నీ
భవబంధంబులఁ బాపుకొమ్మ సగనా ! వైశ్యుండు హృద్యంబునన్
దవనామంబు దలంచి గ్రోలి మఱలన్ । ధాతా సనారీప్రభో

కలయా లేకిది స్వైకమా? కలయె యా । గాఢున్నచో నిట్టిదా
మలినంబైన మహాభయంకర రుజ । న్మాన్పంగ నీమానికి
న్గలదే శక్తియటంచు తాదలచియున్ । గన్నారగాఁగాంచి, మి
క్కిలి, హర్షంబున మేనుజూచుకొని లో । కేశా సనారీప్రభో

గౌరీమానసచోర! దేవ! త్రిజగ । త్కల్యాణసంధాత! యో
పారావారగభీర! భక్తసదయా! ఫాలాక్ష! మృత్యుంజయా!
బైరాగై జనుదెంచినావ, ప్రభు నా । వ్యాధి వ్యదల్ బాపగా
కారుణ్యామృత దృష్టితోడఁత పరా । కాశీసనారీ ప్రభో

ఇనచంద్రాదులు సప్తసాగరములున్ । నీరేడులోకంబులు
న్మునిముఖ్యుల్నగముల్సురుల్జల చరం। బుల్జంతువుల్నింగియున్
నినుగీర్తించిన కానరాని ఘనమా । నీదివ్యమౌ రూపము
న్గని నేధన్యతఁ జెందినాఁడ ప్రభువా । కాశీసనారీప్రభో

ధన్యాత్ముండను 'నిర్వికారపురుషా । త్రైలోక్యసంసేవితా'
ధన్యాత్ముండను 'నిష్కళంక చరితా । త్రైలోక్య సంపత్కరా'
ధన్యాత్ముండను 'తత్వరూప! యచలా। త్రైలోక్య సృష్టీశ్వరా!'
ధన్యాత్ముండను నీదు రాకవలనన్ । ధాతా సనారీప్రభో

లావణ్యాంబుధి సోమ! పాలనయనా! లంబోదరాద్యాదితా
భావాతీత! విశాల! విశ్వపురుషా! స్వామీ! వినోదా! మహా
దేవా! దీనదయాళో! విశ్వమయ। నాదిక్కెవటంచాత్మలో
యే వేళన్భజియింతు భక్తిమెయి। నిన్నీశా సనాత్రిప్రభో

విశ్వోత్పత్తికి మూలమైన విధివో । విజ్ఞాన చంద్రుండవో
విశ్వంబంతయు నేలు నట్టిహరివో । భీభీత్సముంజూపి, యీ
విశ్వంబంతలయంబు చేయు మహిమ । న్విశ్వేశుఁవో దెల్పగా
విశ్వాత్మా। విధిరాణికైన తరమా। పృథ్వీన్ సనాత్రిప్రభో

# తహశీలుదారు ఘట్టము

మహాదైశ్వర్యవిరాజితంబయిన గా । ణ్మాత్రహేంద్రపట్నమ్ముత్రిలో
బహుక్రూరుండు, ధరామరుండును,మహా । పాపిష్ఠిచర్యాత్ముఁడౌ
తహశీల్దారొకడుండె వానినడతల్ । దైవంబుకై సన్నసన్
బహుకష్టంబుగఁదోఁచుచుండుప్రభువా! భవ్యాసనాత్రిప్రభో॥

తనకంటన్బడువారినెల్లర, పురి । న్దాలూకకచ్చేరికి
న్వేనువెంటన్గబురంపి 'నాకెదురుగా । నిర్భీతితో నేఁడు, వీ
ధిని, నీవేగదాపోవుచుంటివిట నీ । దిక్కెవ్వరో చూచెదన్
యనియవ్వారలదూఁచుచుండు సతము । న్నాహా!సనాత్రిప్రభో॥

ఒకనాఁడాతహాశీలుదారుపురిలో । నున్నట్టిశిష్టాళితో
వికటంబాడుచు, నవ్వివారిమనము । ల్వేదించుచుండఁ గ్రమమ్ము తా
నొకచోటున్ననిమీసముండ్రయొడిసి, కో । పోద్రేకుఁడై చెల్వు, కో
రికలీనాఁటికి తీరెనాకనుచుగారీశా! సనారీప్రభో॥

హాఁరికిన్ జిక్కినలేడివోలెనిపుడీ । హస్తంబులన్జిక్కినా
వుర! సన్యాసి భళీభళీకుమతి! నీ । వుండేతలంబెద్ది, యీ
పురమందవ్వరుత్రోడునీడగలరా! పో । బోకుమాయంచు తా
కరమెత్తెన్నిమ్ముఁ గొట్టనెంచి యచట । న్గాశీసనారీప్రభో

చిఱుగడ్డంబును, మీసలున్నడలు, పెం । జీకట్లుబోల్మేనితోఁ
దిఱుగాడన్పురియందు పౌరులుసుచె । స్థీరత్వమున్బాసి, ని
న్నలయన్భీతినిచెందుచుండిరిక నీ । వాసాధురూపమ్ముతో
పురవీధిన్గనిపించరాదని యెని । న్బాజ్యా! సనారీప్రభో॥

కరముల్ లేపినవాఁడు లేపినటులే । కాళ్లాడకన్బొమ్మగా
పురవీధిన్దహాశీలుదారునిలిచె । న్బొలేక నిర్విణ్ణుఁడై
సరసుల్ సత్కవిపండితుల్ గనుచునీ । షన్మాత్రమైనన్ను రే
కరుణాదృష్టినిఁజూడకుండ్రడియతని । న్గాశీసనారీప్రభో॥

అరరేదుర్మతిమమ్ము దూరునటులే । యాదివ్యమౌనీంద్రుపై
కరిగ్గసింహాముభంగియక్కతమునన్ । కాళ్లాడకన్బోయె, సం
చరిగెన్ యాశిశుబాలవృద్ధ జనము । ల్సంతోషముప్పొంగనా
కరుణాహీనునిఁగాంచునట్టిజనులో ! కాశీసనారీప్రభో॥

కృపలేదా! సుజనావనా! శశిధరా! కీర్తి ద్రుమా! నీవు మా
యపచారంబుల సైచి బ్రోవగదవే । యార్తావనా! దేవ! మా
కెపుడీపీడ దొలంగునో యనుచు మే ! మిన్నాళ్లుగా జేయు, మా
తపముల్ నేటికి సిద్ధిబొందెననుచున్ । ధాతా సనారీప్రభో॥

అతివా! నీమగఁడొక్క మౌనివరు విన్ । యజ్ఞానుఁడై తిట్టుటన్
మతిలేకుండగ కొయ్యబొమ్మ పగిది । న్మార్గంబు లోనుండె, నీ
పతి వేగంబున బోయి వేడుకొనుమా । యాసాధు చంద్రున్ ప్రభూ
పతిసిన్నిభుఁగ బెట్టుమంచు నుడువన్ । స్వామీ సనారీ ప్రభో

అతిదుఃఖాన్వితయౌచు నామెజని య । త్యాందోళ నాచిత్తయై
పతినిన్గొని చింతనొందియుచట । న్భావంబులో మిమ్ము తా
నతిభక్తిన్వినయంబు ప్రేమ మొలుకన్ । యార్తావనా!యంచు సం
స్తుతిజేసె న్తనభర్త సౌఖ్యమునకై । సూరీ సనారీప్రభో॥

పారావారగభీర! భక్తహృది, స । త్పద్మాసనా! పాహిమాం
మారాకార!దయాసముద్రనిలయా। మాంపాహిమాంపాహి శృం
గారాకార! వరాననా! మునివరా! కాపాడు మాయంచు, నా
నారీరత్నము వేడెనిట్లు మఱియున్ । నాథా సనారీప్రభో

స్వామీనాపతి క్రూరచిత్తుఁడగుచున్ । సన్మార్గమున్బాసి, తా
నేమాత్రంబును శంకలేక ప్రజల । న్నచ్చోట వీక్షించినన్
యేమేమోయనిదూరి సింగమువలె । న్నైతెంచు శిక్షించగా
శ్రీమంతుండనుచున్ మదంబువలనన్ । శ్రీశా సనారీప్రభో

నాధాధర్మముకాదు మీరుప్రజన । న్యాయంబు గాదూరుచుఁ
బాధల్పెట్టనటంచు నీతిగఁఋపన్ । వహ్వారె బాగున్నవే
నీధర్మంబులు నాకువచ్చు నుదతీ । నీబోటి వారెందరో
యీధర్మంబులుఁ జెప్పిరంచుకసరున్ । యీశా సనారీప్రభో

మాయామానుష రూపధారివని యే । సూత్రంబు యోచించక
నీమాయాకారముఁజూచికర్మారమతితో।మిమ్మేమొదూషించితా
ప్రాయశ్చిత్తము కర్తుఁడౌచు నిలచెఁ । రక్షింపుమార్తావనా
నాయాధారము నిల్పుమన్న నవితఁ ।। నాధా సనారీప్రభో

హృష్టుండౌచును ప్రేమతోఁడుత, కుమా । రీ నీదు సద్భక్తి సం
తుష్ట స్వాంతునిరీతిఁజేసితివి ని । న్నుఁ మెచ్చితిఁన్గాన, నీ
కిష్టంబెద్దియొ కోరుమీవిపుడునే । నీడేర్తు నీకోర్కె, వి
స్పష్టంబౌనటు తెల్పుమన్న తమతో । స్వామీ సనారీప్రభో

సంతోషాన్వితయౌచు భక్తిమెయినో స్వామీ! మహాదేవ! స
ర్వాంతర్యామివి నీకుజెప్పవలెనా । భామామణీ కోర్కులఁ
చింతా కారణమంత నీవెఱుఁగవా । శివార్తుఁడైనట్టి నా
కాంతున్నే నెడబాసియుండ గలనా కాశీసనారీప్రభో

ఈతీరుస్త్రహాశీలుదారు సతి మి । మ్మేమేమొప్రార్థింపగా
'పాతివ్రత్యము, భక్తినిష్ఠలకు నా । భావంబుహర్షించెనో
నాతీ, నీప్రియభర్త లేచు జనుమ । న్నఁన్నామె సద్భక్తితో
జేతుల్మోడ్చి నమస్కరించి జనియెఁ । శ్రీశా సనారీప్రభో॥

అసమానప్రతిభాయుతుండవగు ని । న్నర్థించగానాకు నీ
కుసుమానీకము లేల, పట్టి భ్రమలే । కూర్మిన్నసదా నా మనో
కుసుమంబున్గొనిపూజ చేయుమదిలో । కోర్కెల్ ప్రభూతీర్చ వే
వసుధన్ నాశ్రితకామ! భక్తవరదా । స్వామీ సనారీప్రభో॥

తొలినేవింటినిసత్కవీంద్రుదును డులీ । తోయమ్ముగా "దేవ! ని
న్బలపుష్పంబులు పత్రతోయములతో । న్బార్చించినన్జాలునీ
కలికాలంబుననిన్ను గొల్పుజనుల । న్గాపాడె దీవంచు, గు
ర్బలకష్టంబులనందనీక ధరలో । కాశీసనారీప్రభో॥



సారథి ప్రెస్, తెనాలి. జి. 95 కా॥ 1000 13-2-47

# ఆంధ్రకవితా కుటీరమువారి

రాబోవు గ్రంథములు

బ్ర॥ శ్రీ లక్ష్మణాచార్య కవిగారి

భారతరామాయణ విమర్శనము

వేదాంత కీర్తనలు

శ్రీ అచ్యుతరామారావుగారి

(1) జైహిందుపద్యములు, నాయకుల అభిప్రాయములతో

(2) రాష్ట్రోదయము

(3) మేలుకొలుపు

మండ సూర్యనారాయణగారి (మసూనా)

సుగుణమాల.

# స్వాతంత్ర్యపోరాట విజయ పుస్తకములు

| | | |
|---|---|---|
| కాంగ్రెసు జెండా | (బుఱ్ఱకథ) | 0-6-0 |
| నేతాజీబోసు | ,, | 0-6-0 |
| రైతునాయకుడు | ,, | 0-6-0 |
| హరిజనవిజయము | ,, | 0-6-0 |
| కాంగ్రెస్ గేయములు | | 0-8-0 |
| గాంధీజీ | (పద్యములు) | 0-4-0 |
| జై హింద్ | ,, | 0-4-0 |

Heroes of the Indian Congress. Part I (Telugu) 1-4-0

(ఇండియాలోని కాంగ్రెసువీరులు)

Heroes of the Indian Congress. Part II (Telugu) 1-4-0

Heroines of the Indian Congress. Part III (Telugu) 1-4-0

Heroes of the World. (Telugu) (అమరజీవులు) 1-4-0

Printed at Saradhi Press, Tenali, G, 95 For
Sundara Ram & Sons Q. H. G. 2 Copies 1000 13-2-47

# భక్తిరసగ్రంథరాజములు.

| | |
|---|---|
| భగవన్నుతి (మూ ॥ భా) | 0-10-0 |
| గీతామృతము | 0-6-0 |
| జీవిత రహస్యము | 0-7-0 |
| జ్ఞానామృతము | 0-8-0 |
| ధ్యానామృతము | 0-4-0 |
| ఆనందసాగరము | 0-4-0 |
| అంజలి | 0-4-0 |
| భక్తబృందావనము | 0-3-0 |
| ఆదిత్యహృదయము | 0-3-0 |
| భజగోవిందశ్లోకములు | 0-2-0 |
| లక్ష్మీనృశింహస్తోత్రము | 0-3-0 |
| సంధ్యావందనము (సటీక) | 0-6-0 |
| మంత్రపుష్పము | 0-3-0 |
| విష్ణుసహస్రనామము | 0-6-0 |
| శివసహస్రనామము | 0-6-0 |
| భగవద్గీత (మూలము) | 0-8-0 |

వలయువారు:-

సుందరరాం అండ్ సన్సు, పబిషర్సు తెనాలి.